# గడుసు గంగయ్య

(మహారాష్ట్ర ప్రహసనమునకు తెలుగు)

గ్రంథకర్త

శ్రీపాద కామేశ్వర రావు

మొదటికూర్పు:



ప్రకాశకుడు:

చెఱుకువాడ వేంకటరామయ్య.

అభినవాంధ్రగ్రంథమాలా కార్యాలయము

రాజమంద్రి.

1925

 వెల రు 0-8-0

అన్యదేశమున నాత్మాచారవర్తి యై
జాత్యభిమానంబుఁ జూపె నెవఁడు
మనిచి సహోదరాత్మజులఁ బెక్కుర దీన
జనపాలనఖ్యాతిఁ జూపె నెవఁడు
రచియించి వివిధాంధ్ర గ్రంథముల్ మాతృభా
షాప్రీతి విరివిగాఁ జూపె నెవ్వఁ
డయి వితంతూద్వాహ మాత్మీయ సంఘసం
స్కరణాభిలాషంబుఁ జూపె నెవ్వఁ

డట్టి ఘనునకు మాచిరాజాన్వయాబ్ధి
చంద్రునకు భవానీ శంకరేంద్రపుత్ర
రత్నమునకు దుర్గాశంకర ప్రథమున
కంకిత మొనర్తు దీనినత్యధికభక్తి.

శ్రీ|| కా||

# పీఠిక

ఈ ప్రహసనమందలి కథ యవనయామినీ వినోదముల (Arabian Nights Entertainments) లోనిది. దీనిని పార్సీ, ఉర్దూ నాటకసమాజములవా రనేకులు పంజాబు, బొంబాయి నాగపూర్ ప్రాంతములయందు ప్రదర్శించునపుడు ప్రేక్షకులు అమితామోదమును పొందుచుండుటచే మహారాష్ట్రులు కూడ దీనిని తమభాషలోని కనువదించిరనియు, ఎందును ఈ ప్రహసనము జనరంజకముగా నుండుననియు విని, నాగపురవాసులగు మా మిత్రులు శ్రీమాన్ మాచిరాజు దుర్గాశంకర మహాశయులను దీనిని తెనుగుజేయ ప్రార్థించితిమి. వారాంధ్రులైనను నూరువత్సరములక్రిందట బందరు గుంటూరు ప్రాంతముల వీడి మధ్యపరగణాల (Central Provinces)కు వలసపోయి యుండుటచే మాతృభాషను పఠించు సౌకర్యము లేక మహారాష్ట్రభాషను విద్యాభ్యాసము చేసినవా రగుటచే మధ్యపరగణాలలో వాడబడు తెనుగున దీని ననువదించి దయతో మాకొసంగిరి. దానిని పెంచి మే మీ దేశములోని వ్యావహారి కాంధ్రమున రచించితిమి.

రాజమండ్రి
10-11-1925

చెలికువాడ వేంకటరామయ్య

# ఇందలి ముఖ్యపాత్రములు

—:(o):—

| పురుషులు | స్త్రీలు |
| --- | --- |
| రాజు | రాణి |
| గంగయ్య | చామంతి |
| మంత్రి | మహాలక్ష్మి |
| వెంకటి | గంగయ్యతల్లి |

# గడుసు గంగయ్య

## మొదటి అంకము

---

### మొదటి రంగము

(ఊరిబయట రోడ్డుపై గంగయ్య నిలువబడును.)

గంగ—ఛీ! ఛీ! ఇక వాళ్ల పేరెత్తితే ఒట్టు. స్నేహితులందరూ దగాఖోర్లు, పోకిరీలు, ఫాజీలు. ఈ లోకంలో నిజమైన స్నేహితుడొకడూ లేడు..........అమ్మా! వాళ్ల టక్కులు వర్ణింప వశమా? ఈమాట ఇదివరకే తెలిసుంటే, మాఅమ్మ చెప్పినట్టే నడుచుకుందునుగదా! ప్రాణానికి ప్రాణం యిస్తానని ప్రతీ గాడిదకొడుకూ ఒట్లూ సత్తాలూ పెట్టుకోవడమే! వాళ్లు చేసిన ప్రమాణా లెన్ని అన్నీన్నా?....(ముందుకు చూచి) నేనిక్కడ ఎంతసేపట్నుంచో నిల్చున్నాను, కాని ఎవరూ కొత్తమనిషి కనపడనే లేదూ, ఏంచేసేది? ఇంకో కాస్సేపాగి యింటికి పోతాను.

(మారువేషమున రాజు సేవకుడును వత్తురు.)

రాజు—ఏమిరా వెంకటీ! నా వేషాన్నిబట్టి నన్నెవరేనా పోల్చుకోగలరా?

వెంక—ఓహూ పోల్చనేరు మహాప్రభో. తమరీయాస వేసుకుంది నాకు తెలకుంటే, నానూ పోల్చుకోలేకుందును.

రాజు—నాగురించి లోకు లేమనుకొంటారో వినాలని ఇలా తిరుగుతూంటాను-అదుగో ఎవరో నిలబడ్డారు.

గంగ—ఏమండో, మీరీవూరి కాపరస్తులు కారు గదా?

రాజు—అయ్యా, మాది కొల్లూరు కాపరం, వర్తకాని కేదేనా సరుకు దొరికితే, ఖరీదు చేసుకో పోదామని వొచ్చాను; మావాళ్లంతా వెనకనుండి వస్తున్నారు. చీకటి పడింది. ఈ రాత్రి కాస్త తలదాచుకొనేందుకు ఎసత్రమో, చావిడో చూపిస్తే, మీకు చాలా పుణ్ణెం వుంటుంది.

గంగ—మీవాళ్లెప్పుడొస్తారూ?

రాజు—రేపు ఝాంపొద్దు కొస్తారు. అందాకా మేమే.

గంగ—ఇవాళకి మాయింటికి రండి. రేపటిమాట ఆలోచిద్దాం.

వెంక—ఇంతకన్నా వుందీ మా రాజా, నడండి (పోవుదురు)

---

## రెండవ రంగము.

(గంగయ్య ఇంటిలో గంగయ్య, రాజు, వెంకటియు కూర్చుందురు.)

గంగ—ఏదో, పాపం, బీదాడిమాట విని ఇంటికొచ్చి, కలో, గంజో కాస్త ఆరగించారు. అదే నాకు పదివేలు.

రాజు—సరిసరి. బాగాఉంది దారిబోయే కొత్త వాళ్లని యింటికి పిల్చుకొచ్చి, స్నేహితుల్లాగ ఆదరించారు. మీదయ ఎంతని కొనియాడ గలను! మీ తరహా చూస్తే, మీకు ఒకగొప్పింటివారున్నా, అందర్నీ స్నేహితుల్లాగ గౌరవించేవారున్నా అని తోస్తూంది.

గంగ—(ఉలికి పడి) ఇదుగో! స్నేహితు లన్నమాట నామెద నెత్తకండి. స్నేహితుల్ని నేను వెలేశాను. ఆమాటనే బహిష్కరించాను. ఆపే రెవరేనా యెత్తితే నా కరికాలిమంట నడనెత్తి కెక్కుతుంది. నాకు పరిచయమున్న పాతవాడెవడేనా కనపడ్తే, అవశకునంగా భావించి ఆవాళల్లా గడపదాటి కాలవతల బెట్టను.

రాజు—అలాగా! ఏంచేత? స్నేహానికి విలవ లేదంటారు. తల్లీ, తండ్రీ, అన్నదమ్ములూ, పెళ్ళాంపూ మొదలైన వాళ్ల ప్రేమకన్న స్నేహితుడిప్రేమ యెక్కువంటారే? మరి మీరా మాటనే బహిష్కరించా మంటున్నారు! స్నేహం అంటే మీ కింత రోతెందుకు పుట్టింది?

గంగ — అయ్యో బాబో! నాకథ సాంతంగా విన్నా రంటే స్నేహమంటే మీకూ రోతుద్దుంది. మేవూఁ తరతరాల్నుంచీ గొప్పవాళ్లమే. మానాన్న కాలంచేశేటప్పుడు సగ వాఁస్తి నాకూ, తక్కింది మా అమ్మకీ రాశిచ్చాడు. అప్పటికి నా కిరవైనాలుగో యేడూ. ఇహేఁవుంది! నాచుట్టూ నానా రకాల నాలిముచ్చులూ పోగయ్యారు. వాళ్లెంతమందో లెఖ్ఖే లేదు. వూళ్లోవున్న రౌడీలూ, టక్కర్లూ, కేడీలూ, తాగుబోతులూ, జూజగుండ్లూ, అందరూ బెల్లంముక్కని చీవఁల్లాగ నన్ను కొరుక్కొని తినడం ప్రారంభించారు. వాళ్ల సావాసంచాత అబ్బవలసిన అవలక్షణాలన్నీ నాకబ్బాయి, వాళ్లకూటంలో బాగా తర్ఫీదయినాను. వాళ్లే "గడుసు గంగయ్య"ని నాకు బిరుదిచ్చారు. వూళ్లో వాళ్లెక్కడ గుంపుగూడినా సరే, అక్కడ ముందు నేను ప్రత్యక్షం! ఆతోంబ ఖర్చంతా నాదే. వాళ్ళలోకల్లా నేనే మొనగాణ్ణైనాను, అంతట కొన్నాళ్ళకి నాదగ్గర డబ్బు సరిపోయింది, పైసాతో కూడా వాళ్ళు జారారు. ఐతే వాళ్ళు నన్నొదిల్నా, నేను వాళ్ళ నొదల్లేకపోయాను. ఒక్కణ్ణే వుంటే యేమీ తోచేదికాదు. ఇలాగుండగా ఓనాడూ వాళ్లంతా వొఖచోట కూడినట్టు నా కాచోకీ కట్టింది. నన్నైతే వాళ్ళు పిలవనే లే. అయినా ఏదో సందట్లో నన్ను మరిచుంటా రనుకొని, నా అంతట నేనే అక్కడికి కెళ్ళాను. నేను కనబడగానే వాళ్ళు

తెల్లమొగా లేశారు.ఒహాడూ మాట్లాడ లేదు. కానీ అనుకోని నేనే వాళ్లని పలకరించా. అప్పటికేనా వాళ్ళు మాట్లాడితే వోట్టూ. నా కోపం వొచ్చింది. అది పట్టలేక "ఏఁవఁరా! నా సొమ్మంతా మొన్న మొన్నటిదాకా చెకతిని ఒఖమూటే నాడరూ?" అని గట్టిగా అన్నాను. అంతల్లో ఒహాడు నాదగ్గిరికొచ్చి "ఇదీ మాస్వంతకూటం, నీ అబ్బసొమ్మేఁహీఁ నువ్వు పెట్టలేదూ, మేం పిలిచినవాళ్ళే గాని పైవాళ్ళు లోపలికి రాకూడదూ; గనుక తమరు వొచ్చిన దారినే దయచెయ్యండి" అని మొగవుఁ చిట్లించుకొంటూ అన్నాడు. నా కుండబట్టింది కాదు. "చందా ఏఁవ్వేసుకొన్నారో చెప్పండ"న్నాను. "ఒక రూపాయ"ని చెప్పారు. అ దిచ్చేస్తే సరికదా అని అప్పుడందులో నాకు బంధువుడూ చిన్ననాటి స్నేహితుడూ అయినవాణ్ణోకణ్ణి అప్పిమ్మన్నాను. "నువ్వు గర్భదరిదురిక వయ్యావు, అప్పెలా తీరుస్తావ"న్నాడు. ఇఖ కోపం పట్టలేక వాణ్ణి నాలుగుతిట్టాను. వాడూ నన్ను తిట్టాడూ, ఇదంతా పెద్ద గోలయింది. వాళ్ళందరూ నాసొమ్ము హాయిగా తిన్నవాళ్ళే సుమండీ! అయినా కాలమహిమా! వాళ్ళంతా కలిశి నన్ను పులుసులో కెవీఁక లేకుండా చితగ్గొట్టి తన్ని తగిలేశారు. అప్పట్నించీ స్నేహితులంటే నాకు తలనొప్పి! చేతులో పైసా మెరుగుతూన్నన్నాళ్ళు స్నేహితులకి కొదవ లేదు. అదికాస్తా అయిపోతే ఆఁ అనేవారుండరు. స్నేహం

చేతనే నేను సొమ్ముపోయి దిమ్మబట్టాను. అప్పట్నించీ వాళ్ళ మొగాలు చూడనని ప్రతిజ్ఞ బట్టాను.........నా సంగతంతా మా అమ్మ వింది; కన్నకడుపు గనక నన్ను దగ్గిర బెట్టుకొని పోషిస్తూంది. గొప్పింటివాణ్ణి గనుక పంక్తి నెవర్నైనా పెట్టుకొని భోంచెయ్య”డ మలవాటూ-అదీ కొత్తవాళ్ళనే సుమండీ.

రాజు—వింతగా వుందే మీ వృత్తాంతం! సరే. అయిందేదో అయింది-మీ పాతస్నేహితుల మీద కసి తీర్చుకోవాలని మీకు లేదూ?

గంగ—ఉంది గానీ ఏమిః లాభం? సామర్థ్యం ఎక్కడిదీ? సముద్రంలో అలలు పుట్టి అణిగిపోతూన్నట్టు నామనస్సులో ఆలోచనలుపుట్టి అంతరిస్తూ ఉంటాయి.

రాజు—నాకు వీలయినంతవరకూ నేనూ సాయం చేస్తాను. మీ పగ దీర్చుకోవడానికి మీ కేమిః కావాలి?

గంగ—నే నీవూరికి రాజునైతే వాళ్ళ భరతం పట్టగలను. అది అసాధ్యమైన పని.

రాజు—సరే-ఆ ఉపాయం రేపాలోచిద్దాం-నా దగ్గిర “సర్వవ్యాధిహారం” అనే మందుంది. అది శరీరవ్యాధులనే కాదు మనోవ్యాధిని కూడా మాన్పగలదు. కొంచెం పుచ్చుకోండి-దీనితో మీ మనసుకి కొంత శాంతి కలుగుతుంది. (ఇచ్చును.)

గంగ—(లేచి) ఆహా! ఎంత మధురంగా ఉంది! మనసు కెంతో సంబరంగా ఉంది....మీా రిఘు పడుకోండి! చాలా రాత్రయింది, తలుపు గట్టిగా వెయ్యండి. లేకుంటే దయ్యాలు జొరబడతాయి. ఈవూళ్ళో బ్రహ్మరాక్షసులూ, కామినీ భూతాలు రాత్రిళ్ళు మా తిరుగుతూంటాయి. జాగ్రత్త!.......... (పండుకొనును)

రాజు—వెంకటీ, ఇతనికి మత్తెక్కినది. నీవు పోయి “మీానాక్షీపేటలో గంగయ్య అని ఒక డున్నాడు, ఆతన్ని ఇప్పుడే మోయించుకొనిపోయి మా మహల్లో నుంచి తెల్ల వారిన తర్వాత రాజుగా భావించి తిరిగీ మేముచెప్పేదాకా అతని ఆజ్ఞలను మాఆజ్ఞలవలె మన్నిస్తూ ఉండవలసినదనిన్నీ ఏవిషయంలోనూ కూడా లోపం రానీకూడద”నీ మంత్రితో చెప్పు.

వెంక—చిత్తం మారాజా! (వెళ్ళుదురు)

---

మూడవ రంగము.

[రాజుగారి మహలులో గంగయ్య శయనించియుండ మంత్రి, సేనాధిపతి, పురోహితుడు, జ్యోతిష్కుడు, పరిచారకులు, దాసీలును మేల్కొలుపుదురు.]

మంత్రి—మహాప్రభూ! నిద్ర మేల్కొను వేళయింది.

సేనా—మహారాజా! సేనలు సిద్ధముగా నున్నవి.

జ్యోతి—సార్వభౌమా! ఇప్పు డమృతసిద్ధి యోగం, మంచి తరుణం!

పురో—మహాప్రభూ! సూర్యోపాస్తికి సమయ మయినది.

మంత్రి—దేవా, సామంతులు తమదర్శనమునకై కాచుకొని యున్నారు.

దాసీలు—(ఆరతి పాడుదురు)

గంగ—(లేచితనలో) ఏమిఁ టీగోల? వీళ్లంద రెందుకొచ్చారు?

మంత్రి—(చేతులు జోడించి) రాజశేఖరా, నేడు కొలువు తీర్చెదమని సెలవిచ్చినారు; సర్వం సిద్ధంగా ఉన్నది.

గంగ—నీ వెవడవు? వీరంతా ఎవరూ? ఎందుకీ గోల?

మంత్రి—దేవరవారి మాట నాకు బోధపడ లేదు. ఏలినవారీ దేశమునకు సార్వభౌములు, నేను మీమంత్రిని.

గంగ—(తనలో) ఓహో! రాత్రి పడుకొన్నేటప్పుడు ఆ కొత్త మనుష్యులు తలుపు వేశారుకారు కాబోలు! ఏ భూతమోఁ లోపల దూరి నన్నుతెచ్చి యిక్కడ పడేశింది. కాని దాని పుణ్యమాఁ అస మంచి చోటనే పడేశింది.... నేను

రాజు నైనానట! బలే! (ప్రకా) నేను రాజును గనక మీ రందరు నా ఆజ్ఞకి బద్ధులే కదా?

మంత్రి—సందేహమా? ఓరీ, వీగా! మహారాజు గారికి ఉడుపులు తొడిగించూ....(వాడు తెచ్చును)

గంగ—ఓహో! నాకు రాజువేషం వేశారు గదా? నాటకాల్లో రాజుపార్టు వప్పజెప్తాను. (ప్రకా) ప్రధానీ, నేటి కార్యక్రమ మేమిటి?

జ్యోతి—మహారాజా! ఇవాళ పొద్దుటే ఏలినవారి గ్రహస్థితి కొంచం జబ్బుగా ఉంది. కారణ మేమిటంటే—ఇన శశి కుజరాహులు....14, 10 కలిపి ఇరవైనాలుగూ—ఇవో 16 మొత్తం 40. అంకారకు డేవేన్నా పదో ఇంటఉన్నాడు. మరి వొచ్చిన్నీ, శని కన్యను చేరాడు—రాహు కేతుల దృష్టి కొంచెం మధ్యంగా వుంది. శుక్రుడూ గురుడూ కొంచెం బాగుండ బట్టి గుడ్డిలో మెల్ల యింది. జబ్బుగా వున్న గ్రహాలకి కొంచం దానా లిప్పిస్తే సరిపోతుంది.

మంత్రి—ఏలినవారి ఆజ్ఞలకి ఎదురు చూస్తూన్నాము.

గంగ—సరే, మీనాక్షీపేటలో గడుసు గంగయ్య యింటికి పెట్టెడు మొహర్లు పంపండి.

మంత్రి—మహాప్రభూ! అట్లే పంపెదను, కాని అతడు వ్యసనాసక్తు డౌటచాత ద్రవ్యాన్ని పాడుచేస్తాడని మనవి చేయ సాహసిస్తూన్నాను.

గంగ——నా ఆజ్ఞ యీక్షణమే జరిగి తీరాలి. లేకుంటే-(కోపముతో చూచును.)

మంత్రి—ప్రభూ! ఇప్పుడే పంపిస్తూన్నాను.

గంగ——సరే-రెండో ఆజ్ఞ జాగ్రత్తగా వినండి. మంత్రి గారూ, యీవూళ్ళో అతని స్నేహితుల జాబితా అతని తల్లి దగ్గిరున్నాది, దాని ప్రకారం వాళ్లందరినీ గాడిదలమీద ఊరేగించి పైకి తగిలేశి, వాళ్ళఆస్తి మాస్తి జప్తుచేశి రాజావారి దివాణంలో చేర్చండి. ఆవైభవం జరిగేటప్పుడు మాకు మనివిచెయ్యండి.

మంత్రి—ఓరీ, వీరా! చామంతిని ఫలహారం జాగ్రత చేయమని చెప్పు-దేవరవారి ఫలహారంవేళ మించిపోతూంది.

గంగ—(తనలో) ఇంత వేగిర మేంఫలహారం? రాజులలాగు తింటారు కాబోలు, అందుచేతే నడవలేకుండా ఊరిపోతారు. (చామంతివచ్చును.)

అమ్మరొయ్యో! ఇది నిజంగా కామినీభూతమే, లేకుంటే మనిషింత చక్కగా వుంటుందా?—అయ్యొ బాబో! నన్ను చంపేస్తుందో, లేకుంటే ఏ పర్వతం మీదికేనా తీసుకోపోతుందో?—ధైర్యంగా వుండాలి, జడుసుకుంటే మీదవాల్తుంది, (ప్రకా) మంత్రీ, ఇదెవర్తె?

మంత్రి—ఏలినవారు పెంచిన దాసి—చామంతి.

గంగ—(తనలో) మనిషే నట! (ప్రకా) ఇదేం పని చేస్తుంది?

మంత్రి—ఏలినవారికి ఫలహారం సిద్ధంచేస్తుంది, ప్రభువుగారు ఆరగించాలి, తర్వాత ఆకుమడుపు లిస్తుంది, విసెన కర్రతో విసురుతుంది.

గంగ—అమ్మయ్యో-నన్నింతతో వొదిలేది కాదు, నా దగ్గిరచేరి రక్తం పీల్చుతుంది, ఇది తప్పకుండా భూతవే. దీన్నెంతవేగం తగిలేస్తే అంత మేలు....(ప్రకా)ఓసీ,యీరోజు నావొంట్లో యేమీ బాగాలేదు, ఫలహారం చెయ్యను,తల దిమ్మగా వుంది.

చామ—(నవ్వి) మహాప్రభూ! మీ సేవకురాలు చల్లని పన్నీరు జల్లి సంపంగినూనె తలంటుతే, తలదిమ్మ,సకల రోగములు పోతవి.

గంగ—(తనలో) ఆఁ! దీని ముసిముసినవ్వులు చూస్తే నన్ను వల్లో వేసుకోవాలని చూస్తూన్నట్టుంది. అదుగో పైని నీరు జల్లుతుందట....అంటే మంత్రిస్తుం దన్నమాట. ఆపైని నూనె రాస్తుందట,అప్పుడు తల అంటేస్తుందట-ఇల దానికి చిక్కితే ఇక ప్రాణా లుంటాయా? ప్రాణాలు పోతే రోగం పోదూ? దీని మాటలు రెండర్థా లిస్తున్నాయి ..కాని ఇది ఉత్తమ్మవైన పిశాచి—దీన్నొదుల్చుకోవాలి. (ప్రకా) నాకు నిద్ర వొస్తూవుంది నువ్వపో.

చాము—చిత్తం, కైదండయిచ్చెదను.(దగ్గరకువచ్చును)

గంగ—ఇదేమిటి చెప్పి యిస్తా నంటున్నాది? మత్తు మందు కాదుగదా? (పరికా) నా దగ్గిర రాకు-దూరంగా పో.

చాము—(వయ్యారముగా) పోనా—పో—నా—?

గంగ—అమ్మయ్య-పీడ వొదిలింది—(పోవును)

రాజు—ఈతనికి సర్వరోగహార మిచ్చి ఇంటికి చేర్చుము, వెంకటీ.

వెంక—చిత్తం- మాప్రిబో.

---

## నాల్గవ రంగము.

(గంగయ్య ఇంట్లో పండుకొని యుండ తల్లి కూర్చుండును.)

గంగ—నా కెంతో శేపాయి మెలుకు వొచ్చింది-మంత్రి వాళ్లూ రాలేదూ, చావంతీ రాలేదేమి? యీవాళ పీళని శిక్షించాలి.

తల్లి—గంగన్నా,గంగన్నా-పలవ రిస్తున్నావా?

గంగ—ఇదెవర్తె?—గంగ న్నెవరూ?—నన్ను కాదు

తల్లి—పిచ్చెక్కింది లేవ్వేమిరా? బజారు కెళ్లా ల్లేగా న్నెక్కడి కెళ్లావు? ఇంట్లో బియ్యం లేవూ కర్రలూ లేవు

గంగ—ఎవరది?—నేను రాజును-మంత్రీ, చావంతీ నౌకర్లూ, చాకర్లూ ఏరీ? ను వ్వెవర్తెవు?

తల్లి—ఇదేవిఁటిరా? మెలఁకువతో వుండే పలమాటలాడుతున్నావూ! నువ్వేవిఁటి? రాజు వేవిఁటి?—గంగన్నా! నే న్నీతల్లిని కాన్రా? నన్నే మర్చిపోయావూ?

గంగ—నేన్రాజుని కానంటావా?....మనింటికి మొహాల్లొచ్చాయా లేదా?

తల్లి—చిన్నపెట్టెత్తో ఎవడో ఏదో రాజుగారు పంపారని తెచ్చాడూ, ఆ గదిలో పెట్టించాను, చూసుకో.

గంగ—అది నేనే పంపించమంటే మంత్రి పంపాడు. నారాజ్య వేఁవరు లాక్కొన్నారూ?

తల్లి—అయ్యో! వీడికి మతోయింది. చెరుపూ మరుపూ మాట్లాడతూ వున్నాడు-సన్నిపాతం వచ్చిందేవోఁ? మందిప్పించాలి_మల్లిగాడ్ని తోడిచ్చి వొయిద్దుడికాడికి పంపుతాను-(వెళ్ళును)

---

### ఐదవ రంగము.

(గంగయ్య వీపు తడుముకుంటూ వచ్చును.)

గంగ—వైద్యుడన్నా యముఁడన్నా ఒకటే-నేను వెళ్ళగానే మాటైనా ఆడకండా గుంజకట్టి మెడమీదా వీపుమీదా వాత లేశాడు-వాడి శిగ తరగా! పదిరోజుల్దాకా చప్పిడి పత్థెం కట్టాడు, తిన్లేక ఛస్తూన్నాను. ఒఖరోజు రాజు

నైనందుకు నాలుగు వాత లద్దాయి! రోజూ రాజయ్యే వాళ్లు ఎన్నివాత లేయించుకుంటారో? ఆభాధ ఏలా భరిస్తున్నారో? ఇక రాజ్యానికో దండం.

(రాజు మూరువేషముతో వచ్చును)

రాజు—ఏవండీ గంగయ్యగారూ, సుఖంగా వున్నారా? మీ స్నేహితులమీద కసి తీర్చుకున్నారా ? (వీపుతట్టును)

గంగ—అమ్మయ్యో ! వీపు మీద చెయి తీయండి బాబూ, పుళ్ళి ంకా మాన లేదు.

రాజు—ఏఁవిఁటండీ మీకు బాధ ?

గంగ—నాస్నేహితులకి వున్నరోగం వూడింది, నాకు లేనిరోగం వొచ్చింది-ఎం చెప్పను! బుద్ధితక్కువ నాది.

రాజు—అలా గంటారేవిఁ ?

గంగ—వినండి. ఆనాటిరాత్రి మీరు తలుపు వేశారు కారు-ఆపాళంగా వొకబ్రహ్మరాక్షసీ, వొకకాఁవిఁనీ భూత వూఁ నామీద వాలాయి-మొదటిది నన్ను రాజును చేశింది, తక్షణవేఁ నా స్నేస్తులికి తగిన శాస్తి చేశాను....కానీ, నే నో తెలివితక్కువ పని చేశాను....కావిఁనీభూతం దాసీదాని వేషంతో వొచ్చింది-ఏఁవందంగా వున్నా దనుకొన్నారూ ! అయిహోయి! నన్నుచూసి నవ్వి దగ్గిరకొచ్చి వొయ్యారంగా

ఫలార విస్తా నంది. దయ్యంచేతి తిండి తినడవిష్టంలేక వొద్దన్నాను....దాని కోపం వొచ్చింది_మరేంవుంది? మా యింట్లోకి నన్నొక్క గిరవాపెట్టింది. తెల్లవారి లేచేసరికి రాజ్యవూం లేదు మంత్రి లేడు. మా అమ్మ ప్రత్యక్షం అయింది-దాని ముందర నా రాచరికం గొడవ యేకర్వెట్టాను, దాంతో హడలిపోయి నాకు సంధత్రిందని బెంగెట్టుకొని చప్పున వైద్యుడిదగ్గిరికి సాయివిచ్చినన్నుపంపింది-వాడులుకూ పలుకూ లేకుండానే వీపంతటా వాత లేశాడు—చప్పిడి పథ్యంలో చస్తూన్నాను.

రాజు—అలాగా? నే మందిస్తాను, పదండి (వెళ్ళుదురు)



# గడుసు గంగయ్య

## రెండవ అంకము

---

### మొదటి రంగము.

(గంగయ్య ఇంటిలో రాజు గంగయ్య ప్రవేశింతురు)

రాజు—అయితే, మీ రొకసారి రాజయ్యా రన్న మాట. మీ కోరిక తీరిందా ?

గంగ—ఆహా ! అయ్యాను. మాయింటికి పెట్టెడు మొహర్లు పంపాను. పాతస్నేహితులకి ప్రాయశ్చిత్తం చేశాను.

రాజు—రాజుగారి మహల్లో విశేషా లేఁవున్నాయి ?

గంగ—ఏదండీ చూడ్డానికి వేళా?....అన్నిటికీ ఏఁవిఁ గాని మీతో ఓ మాట చెప్తాను, దాన్ని రహస్యంగావుంచాలి సుమండీ ! ఇదుగో- ఈరాజు వొట్టి మూర్ఖుడు.

రాజు—అదే వఁలా గంటూన్నారూ ?

గంగ—అయ్యో! ఆ మహల్లో ఒక మనిషుంకండి-నేను దాన్ని కాంతిసీభూత మనుకున్నాను, గాని తరువాత వాకబు చేస్తే అందరూ మనిషే అని చెప్పారు. వాహ్వా! దాని చక్కదనం ఏమని చెప్పను! స్వర్గంలో కూడా అలాంటివా ళ్లుంటారంటే నేనమ్మను.... చూశారా-అటువంటి దాన్ని రాణీని చేసుకోక ఇంకెవర్తెనో యేభ్రాసిని రాణీ చేసుకున్నాడు-అంతకన్నా తెలివితక్కువ్వాడుంటాడా ?

రాజు—దాసీదే అంత చక్కగా వుంటే ఇంక ఆరాణి ఎంత చక్కందిగా వుంటుందో? ఎక్కువ చక్కదానిగా వుండ కూడదా ?

గంగ—ఇది అలా త్రైరాశికంవల్ల తేలేది కాదంటోయి. చామంతికన్నా చక్కం దిఖ వుండదని నా నమ్మకం_దాన్ని చూస్తే మీకూ అలాగే తోస్తుందని దృఢంగా చెప్పగలను....ఇంతెందుకూ! చామంతిని తల్చుకుంటే నాకీవాతల బాధ ఇట్టే తగ్గిపోయింది. అది తిరిగి కనబడితే అరవై వాతలేయించుకుంటాను. నిజంగా, దాన్నే పెళ్ళాడ వంటూ వుంటే వీలువల్లా వాత లేయించుకోన్నా నాకు బాధనిపించదు. నమ్మండి.

రాజు—మీ అదృష్టంచాత అలా కలిసి రాకూ కదా?

గంగ—అబ్బో! అదిరాజుగారి చేతిలోపని....అబ్బబ్బ బాధ హెచ్చుతున్నాది, ఇహ పరుండండి.

రాజు—ఇదుగో! నాదగ్గిర "సర్వరోగహారం" వుందే, అది కొంచెం సేవించండి—మీ బాధ నివారణౌతుంది, నిద్ర బాగా పట్టుంది. (ఇచ్చును)

గంగ—ఔను సుమండీ-ఆ వేళే మరికొంచెం అదు గూడా వేసుకున్నాను (తిని) ఆహా! అమృతంలాగుందండీ.... ఏమి చలవ! ఏమి హాయి! కళ్లప్పుడే మూత లడుతున్నాయి.

(పరుండును)

రాజు—ఇతన్ని వెనకటి వలెనే రాజుని చెయ్యమని మంత్రితో చెప్పు, వెంకటీ (వెళ్ళుదురు)

---

## రెండవ రంగము.

(మహాలులో మంచంమీద గంగయ్య పవళించి యుండును)

మంత్రి—మహాప్రభూ! కొలువు తీర్చువేళయింది.

గంగ—(తనలో) మళ్లీ బ్రహ్మరాక్షసి మహత్తే! మంత్రీ, తక్షణమే మీనాక్షిపేటలో వైద్యుడికి మెడమీద నాలుగూ వీపుమీద నాలుగూ వాతలు వేయించి యిక వాతలవైద్యం మానుకొమ్మని గట్టిగా చెప్పండి....

(రాజు ప్రవేశించును)

రాజు—గంగయ్యా! ఈవూరు రాజె లాంటివాడని అన్నావో జ్ఞాపకం వుందా?

గంగ—ఎవరు మీరు?

మంత్రి—మా నిజమైన మహారాజుగారు—నీభోగ వీక యింది దిగూ—మహాప్రభూ! వీనికి కఠినమైన శిక్ష విధించ వలెను.

గంగ—దేవరా! నా మనసులోమాట రహస్యంగా వొాఖరిణో అన్నమాట నిజం—అయితే అబద్ధవాడి రాజుగార్ని ఎప్పుడూ పొగుడుతూం డాలా? వల్లమాలిన రాజ్యంలో వఖ డైనా నిజం చెప్పడవూ మీకు గిట్టదా? మారాజా!

రాజు—వీడు చక్కగా తప్పుకున్నాడు.... సరే—మంత్రీ, నాలుగు కొడవళ్లు ఎర్రగా కాల్పించి తెప్పించు.

మంత్రి—చిత్తం. ఎవరురా అక్కడ?

గంగ—కొడవళ్లెందుకూ? వాత లేస్తారు కాగోలు. మారాజా! వైద్యుడి కేనా?

రాజు—ముందు వైద్యుడికీ తరువాత నీకూ!

గంగ—ప్రభూ! ఎరక్కపోయినప్పటికీ రాజుగారికి రెండుపూటలు కడుపునిండా అన్నం పెట్టినందుకు నాకు వొంటినిండా వాత లేయిస్తారా? మీ రాజ్యంలో అన్నదా నాని కిదా ఫలం?

రాజు—కాదుకాదు-నువ్వు కోరుకొన్నదే యీబహుమతీ, యీది తెచ్చుకో గంగయ్యా! ఆవాళ ఏమన్నావో.

గంగ—ఔనూ-పెళ్ళి చేస్తే వాత లేయించుకుంటానన్నాను.

రాజు—అలాక్కాదు-వాతలు వేయించుకున్నాక పెళ్ళి !

గంగ—అది కాదు మహాప్రభూ! పెళ్ళయితే పెళ్లాం సగం శరీర మవుతుంది గదా, అప్పుడు వాతలేస్తే చెరి సగమవుతాయి అని అన్నాను. ముందు పెళ్ళి కానీండి మారాజా, వాతలమాట చూసుకో వచ్చును.

రాజు—బలే! మంచి యెత్తు వేశావు. నీబుద్ధికి సంతోషించి నువ్వన్నట్టే చేస్తాం. మంత్రీ, చామంతి నలంకరించుకొని రమ్మని కబురంపుము.

గంగ—కానీ, ముందు దాన్నిచ్చి పెళ్ళిచేస్తారుకదా? తర్వాత అట్నుంచి నరుక్కొద్దాం.

(చామంతి వచ్చును)

రాజు—చామంతీ, ఇతడు గొప్పింటివాడూ గడుసువాడూనూ, నిన్ను పెళ్ళాడుతా నంటున్నాడు. నీకిష్టమేనా?

చామం—(సిగ్గుతో) ప్రభువువారు నన్ను పెంచి పెద్దదాన్ని చేసినారు. ఏలినవారి చిత్తం.

గంగ—(తనలో) వాహ్వా! నాఅదృష్టం పండింది.

రాజు—చామంతీ, ఇంకో మాట చెప్పాలి. ఇతన్ని పెళ్లాడితే నిలువల్లా వాత లేసుకోవాలి, అప్పుగో కొడవళ్ళు సిద్ధంగా వున్నాయి, ఏం గంగయ్యా?

గంగ—చిత్తం, ముందు దాని క్కానీండి, చిన్నాళ్ళకి ముందియ్యాలి బహుమానం.

రాజు—ఏవి, చామంతీ?

గంగ—ఏవంటుదో?

చామం—ఏలినవారి చిత్తం.

రాజు—ఏం గంగయ్యా?

గంగ—రక్షించినా శిక్షించినా ప్రభువువారిదే భారం.

రాజు—మంత్రీ, ఇక నాలస్య వెందుకు? పెళ్ళికి కావలిసిన ఏర్పాటులు చేయించుము, మంచి వైభవంతో జర గాలి వివాహం.

మంత్రి—చిత్తం. మంచి ముహూర్తం త్వరలో పెట్టితాం.

జ్యోతి—మీన మేషాలు లెక్కించాలి. శని బాగానే వున్నాడు, మరిగత్తే, దేవుడు చాలా మేలుచేస్తే, ఆరోయింటా కుజుడా, రెండో యింటా, రవి శుక్రిలా, వాళ్లట్టె చెడ్డవాళ్లు కారన్నమాటే, బుధుడు నాలుగో యింటికి రేపొస్తాడూ?



గంగ—ఎవ డేయింటి కెప్పుడొస్తె మాకేం కావా లయ్యా? నా యింటికి చావంతి వేగంవచ్చే సాధనం చూడు.

జోస్యతి—సరిసరి! తొందర పడతావేం? మంచీ చెడ్డా వద్దయ్యా! నాలుక్కాలా లదీ నువ్వూ చక్కగా వుండాలా?

గంగ—మా చక్కగా వుంటుంది, మీరేదీ అడ్డు తే కుండా వుంటే వేగవూరొస్తుంది. గ్రహాలన్నిటికీ వున్నట్టే మాయిద్దరికీ వొకయిల్లిప్పించండి మహారాజా!

జోస్యతి—మహాప్రభూ! ఎల్లుండి సాయంత్రం ఎని మిది గంటల మిధునలగ్నం వివాహానికి రహితముహూర్తం. కన్యారాశికి మాత్రం కొంచెం శాంతి చేస్తే సరి.

గంగ—చావంతికి శిక్ష తప్పించి ఆ కన్యకిశాంతి ముందు చేయించండి మహాప్రభూ! మీ పేరు చెప్పుకొంటూ బతికున్నన్నాళ్ళూ సుఖంగా వుంటాం.

రాజు—సరే, పెళ్ళిచేసి వీళ్ళకోయిల్లు ఏర్పాటుచేసి యావత్తు ఖర్చులూ దివాణంలోంచి పెట్టండి. (వెళ్ళును)

మంత్రి—మంచి యేర్పాటే కావించినారు ప్రభువు వారు. వ్యసనాసక్తులకి చేత సొమ్ము చిక్కనియ్యకూడదు.

(వెళ్ళుదురు)



# గడుసు గంగయ్య

మూడవ అంకము

---

మొదటి రంగము

(గంగయ్య ఇంట్లో భార్యాసహితుడై కూర్చుండును.)

గంగ—రాజుగారు మంచిపనే చేశారు గాని, మంత్రి
నకంలో పుడకలాగ అడ్డొచ్చి పైసా చేత చిక్కనిచ్చాడు
డు. క్షవరం చేయించుకోవడానికేనా పైసా కావాలంటే
జుగారి లెక్కల్లో రాయించాలి- పట్టుమని ఒకకానీ చేత
క్కదు కదా! ఈ మనోవ్యర్తి బతుకు గడవడ మెలాగా!

చాము—ముక్కుపుల్ల కొనుక్కోవాలంటే ముగ్గుర్నడ
లి, మీరు రాజయినప్పుడూ బండెడు మోహర్లు పడేసుకో
దూ? పుర్రెకొద్దీ బుద్ధంటారు, మీ గడుసుతన మక్కడే
పనికొచ్చిందికాదు.

గంగ—గతించినదాన్నిగురించి చింతించిన ఫలంలేదు,

మనకి డబ్బొచ్చే సాధనం చూడాలి-నా కొక్కటే మార్గం తోస్తూంది-కోప్పడనంటే చెబుతాను.

చామ—కోప మెందుకూ? గాదికింది ఎలకల్లాగ తినడానికుంటే సరా మరి? మనసొచ్చిన నగా కంటికి నచ్చిన చీరా రవికా కొనుక్కొందికి వీలే లేదుగదా? మనిషికి ఉన్నది నిండూ, పసలానికి తిన్నది నిండూ. మీకు తోచిన మార్గం చెప్పండి.

గంగ—రాజుగా రన్నడక్కుండా రాగిడబ్బైనా చేతికి రావాలంటే నీ చేతులో ఉంది కీలకం. ఏదైనా నగ—

చాను—ఇదా మీకు తోచిన ఆలోచన? నా వొంటిమీద నాలుగ్గుల్ల లున్నాయని మీ కన్నెర్రిగా వుందా? ఇవి మీరు పెట్టినవి కావు-రాణిగారిధర్మాన వొచ్చాయి, వాటిని నేను ముట్టనివ్వను, అవి అమ్మడానికి వల్లకాదు.

గంగ—అమ్మ క్కర్లేదూ-నాలుగు రోజు లెక్కడేనా కుదవబెట్టే తర్వాత విడిపించుకోచ్చును.

చావం—ఇలా గొన్నని తనఖా పెట్టడం? పెడ్తే విడిపించడం ఎలా? నేడు లేనిసొమ్ము రేపొస్తుందా? తాకట్టు వాకట్టు కావడమేగా? నా చాత కాదు. మీ రేపాట్లు పడతారో మీ ఖర్మం. పెళ్ళైనప్పట్నుంచీ ఒకకోకైనా కొనలేదు గాస, తగుగునమ్మా అని తాకట్టు పెట్టడానికి తల్చారు.

గంగ—నేనో గోచీపీలిక్కైనా కొనుక్కున్నానా? పెళ్ళి నాటి బట్టలతోనే కాలక్షేపం కానిస్తూన్నాను.

చామం—ఉన్నదందా పూడిన తరువాత బుద్ధొచ్చింది. "అయ్యకి విద్దా లేదు, అమ్మకి గర్వం లేదు" ఉన్నన్నాళ్ళు ఒకరిమాట వింటేనా?

గంగ—సరే-ఇప్పు డేవనుకుంటే ఏవిఁలాభం! ముందు కథ జరగడవెఁలా? ఏదేనా సూత్రం చూడూ. ఊరుకుంటే యెలాగ?

చామ—ఆడదాన్ని నాకేంతెలుస్తుందీ, గడుసువాళ్ళని పేరోటుంది గదా! ఏదో మీరే సాధనం ఆలోచించండి.

గంగ—ఏది చెప్పినా అడ్డక్ర వేయడం మానవే! నాయెత్తుల్నీకు నచ్చవూ, నువ్వేమీ చెప్పవూ, మ రెలాగ?

చామ—ఈమా టడ్డుచెప్పను.

గంగ—ఆలా అభయం ఇస్తే ఆలోచనల కొఁదవ ఉంచను....ఇదుగో-ఒక పన్నాగం ఉంది, దానికి నువ్వొప్పుకుంటే చిటికలో కార్య సిద్ధిస్తుంది.... నేనూ రాజుగారి దగ్గిర కెళ్ళి చావంతి చచ్చిపోయింది మారాజా అని మొర్రపెడ్తాను, దయదల్చి ధన-మిస్తారు....నువ్వూ రాణీగారి దగ్గిరకెళ్ళి నేను చచ్చిపోయినానని మొరపెట్టు-ఆవిడా కొంతయిస్తుంది-మన యిల్లు నిండుతుంది

చామ—ఛీ! ఛీ! ఆ వోఘాయిత్రైంమాట నానో
టనలేను సుమండీ!

గంగ—ఇందులో ఏఁవుందీ మాటవరస కంటాం,గానీ
నిజంగా చస్తావాఁ? నీలాపనింద పోతుంది....ఇది మాంచి
యెత్తూ-ఉళక్కి చావులు నాటకాల్లో చూడలేదూ నువ్వూ?

చామ—చూడకేం?

గంగ—సరే మరి-మనవ్వూఁ ఓనాటకం ఆడదాం.
నాటకాల్లో ఏడవడం, నవ్వడం, చావడం, పుట్టడం—ఎన్నో
తమాషాలు జరుగుతూ వుంటాయి-అవన్నీ బూటకాలు-
అంతా డబ్బుకోసవేఁ. మనవ్వూఁ నాటకవాఁడి డబ్బు గణిద్దాం.

చామ—నే నేవఁన్నా అంటే మీమాట కడ్డొచ్చా
నంటారు- కోప్పడకండా వుంటే వొఖమాట చెప్తాను.నాట
కాల్లో రాజులు రాజులూ కారు, రాణీలు రాణీలూ కారు.
ఎవర్లో ఆవేషాలువేసి ఆటలాడతారు, దొంగమొగుళ్ళ కోసం
అబద్ధప్పెళ్ళాలేడుస్తారు-సంసారుల్నలాగేడవమంటే ఏం
బాగుంది? మీరు మొగాళ్లూ. ఏవిఁచేశినా సరిపోతుంది. నా
పసుపూకుంకం చల్లగా వుండగా నే నంతమాట అనలేను.
మీరే రాజుగారి దగ్గిరా రాణీగారి దగ్గిరా మొఱ్ఱలు పెట్టి
డబ్బు గణించండి-నే నా పనీ చెయ్యలేనూ, నాకా డబ్బూ
వొద్దు.

గంగ—(తనలో)దీని కొంచెం పురి ఎక్కించాలి-(పైకి) రాజుగారి దగ్గిర్నించీ నేనేదో తేగల్ను, రాణీగారి న్నే నరగను, మొగాడ్ని వారిదగ్గిరికి వెళ్ళడమెలా ?....ఒకవేళ వెళ్తాననుకో, ఆవి డేమివ్వగల్దూ ? నోరు చెప్పుకోవడమేగాని ఆవిడికి డబ్బెక్కడిదీ? ఏరోజు కారోజు రాజుగారిస్తేకద్దూ లేకుంటే లేదూ.

చామ—రాణీగారంత చాతకానివారనా మీ ఊహ? ఆవెఁకి డబ్బుండదేం ? చూతాం మరీ-ఇద్దరం వెళదాం, ఎవరెక్కువ తెస్తారో చూద్దాం.

గంగ—(తనలో) త్రోవలో కొచ్చింది. రాణీగారికిదంటే ప్రాణం, బాగా డబ్బులాగే విధం ఆలోచించాలి. (పైకి) నువ్వెళ్ళినా రాణిగారెంతో యివ్వలేదు-ఏదో తృణమో పణమో నువ్వూ తెస్తే వేణ్ణీళ్ళలోకి చన్నీళ్ళవుతుంది, బిందె నిండుతుందని చెప్పాను.

చామ—మీకన్నా నేనెక్కువ తెస్తే ఏం పందెం వేస్తారు చెప్పండి.

గంగ—నువ్వెచ్చు తెస్తే నీసొమ్ములో నాసొమ్ము కలుపుదాం; నేనెక్కువ తెస్తే నాసొమ్ములో నీసొమ్ము కలుపుదాం, మొత్తం ఇద్దరమూ వాడుకొందాం.

చామ—అలాగైతే అంతా మీరే ఖర్చుచేసి అద్దపైన కుమ్మాయి జక్కాయి గాళ్ళకీ అందజేసి ఖాళీ చేతులు

నలుపుకుంటూ కూర్చోడానికా ? అలాక్కాదు. ఎవ రెవ
సొమ్ము తెస్తే వాళ్ళు చెప్పినట్టూ రెండోవాళ్ళు నడుచుకో
వాలి.

గంగ—అదికాదు-నీమాటా నామాటా వొకటై
నేనీ్న మాట వింటాను, నామాట వేరూ నీమాట వేరూ అయి
నామాట నువ్వినాలి,

చామం—ఈ గడుసుమాట లికను కట్టిపెట్టండి. నే
వేశిన పందెం వొప్పుకుంటే నేను రాణీగారిదగ్గిరి కెళ్తాన
లేకుంటే వెళ్ళను-ఇఖ మీపాట్లు మీరు పడండి. రాజుగా
దగ్గిరి కెళ్ళండి, మానండి నాకేం ?

గంగ—అలాగే-నువ్వన్నట్టే వొప్పుకొంటాను. ప
రాళ్ళు చేతులో పడే సాధన వాలోచించాలి కాని పంతంత
నేవుంది. నువ్వు తెస్తేనేం ? నే న్తెస్తే నేం ?

చాము—ఇప్పుడలాగే అని ఆతర్వాత మారగూడదు
అలాగైతే నాసొమ్ము రాణీగారి దగ్గిరే వుంచేస్తాను-పేచీ
నాదగ్గిర పనికి రావు.

గంగ—రూపాయిలానీ-నువ్వన్నట్టే చేతాం.

చాము—మాట తిరక్కూడదు సుమండీ.

(పోవుదుర

---

## రెండవ రంగము.

(రాజుగారు మంత్రియు నాలోచించుచుందురు)

మంత్రి—వారీలాగు జాబంపారు, మనం సిద్ధంగా వుండి, వాళ్ళు కప్పం కట్టినట్టాయినా, ఊరుకుందాం; కట్టరా, యుద్ధం చేతాం ప్రభూ!

రాజు—సరే-అలాగే కానిమ్ము.

(గంగయ్య ఏడ్చుచు వచ్చును.)

గంగ—బాబూ, నా కొంప మునిగింది,

రాజు—ఏమీ! నీకేమి ఆపద వచ్చిందీ?

గంగ—మహాప్రభూ! ప్రభువువారు వన్నోయింటివాణ్ణి చేశారు గాని, పాపిష్టి దైవం చూడలేకపోయాడు.

మంత్రి—ఏఁవఁయింది? దొంగలు పడ్డారా ఏఁవిటి?

గంగ—అలాగయితే ఇంత బాధుండదు. నాకొంప కూలింది మహాప్రభూ!

రాజు—మీరు ఇద్దరూ సుఖంగా వున్నారా?

గంగ—అలాగుంటే నాకేడుపేఁవీఁ! మారాజా!

రాజు—ఏఁవిఁ జరిగింది?

గంగ—చామంతి నన్నొదిలి పోయింది_ మాప్రభో!

మంత్రి—ఏఁవీఁ? చామంతి పారిపోయిందా!

గంగ—రావఁరావఁ అధాలాగు చేసేదికాదు. భగవంతుడు దాన్ని తీసుకో పోయాడు.

రాజు—ఇంత హఠాత్తుగా ఏఁవొచ్చింది దానికి ?

గంగ—అదేదో వాయువట ! అరగడియలో అంత
అయిపోయింది- వొట్టి కర్రే!

మంత్రి—మాకు చెప్ప లేదేవిఁ ? తగిన వైద్యుడ్ని పం
పించి వుందుమేఁ ?

గంగ—దేని కేనా అవకాశం వుంటేనా? మారాజా !
తిండికి రావే అని పిలిచాను. ఇదుగో వస్తాను, వొళ్లు నొప్పి
గా వుందన్నాది. అదేవిఁటో అని వెళ్లి చూశేసరికి కాళ్లు
చాచేశింది, కళ్లు తేలవేశేశింది- వొళ్లంతా మంచులాగ
చల్లగా అయిపోయింది. ప్రాణ వేఁతన్న పోయిందో తెలియ
కుండానే యెగిరిపోయింది- గూట్లో పిట్టలాగ పారిపోయింది,
మహాప్రభో !

రాజు—సరే- ఏడవకూ- తిరిగీ పెళ్లీచేస్తావుఁలే- చచ్చి
నవా ళ్ళేడిస్తే వస్తారా ? ఊరుకో పాపం!

గంగ—ఇహ నాకు పెళ్లొద్దు మారాజా ! రత్నం
లాంటి దానితో కాపరంచేశి ఇంకోర్తెతో బతుకుతానా?
దాని అస్తులు గంగలోకలిపి యే బైరాగుల్లోనో చేరిపోతాను.
దానికి మంచిగతులు కలిగేలాగు చెయ్యడం భారం మీది.
మీకన్నబిడ్డలాగు పెంచారూ, పెళ్లి చేశారూ. దాన్ని ఇప్పుడు
స్వర్గానికిపంపేయండి మాప్రభో !

మంత్రి—ఎలాగా పంపడం?

గంగ—అదే చెప్పింది. వెయి గోదానాలు మిమ్మ ల్నడిగి చేయించమన్నాది. అలా చేస్తేనేగాని దానిఆత్మకి శాంతుండదన్నాది.

మంత్రి—మహాప్రభూ! చామంతి కులానికి తక్కువైనా కూటికి తక్కువ లేకుండా పెరిగింది, గనుక పెద్దపరుగే పెట్టింది. వెయ్యి గోదానాలు వట్టిమాటలతో తీరేవా?

గంగ—లేకుంటే భూతవై అందరిని బాధిస్తుంది బాబూ! ఆ అపకీర్తి రాజుగారికే వుంటుంది.

రాజు—పోనీ, మంత్రీ, వీడికి పదివేల రూపాయి లిప్పించు. వాడిమనసు కుదట పడుతుంది.

గంగ—ఇంకోమాట చెప్పింది. పెద్దదినం జరపడానికి వాకవెయ్యి కావాలి యిప్పించండి, మహారాజా!

మంత్రి—అందులోనే సరిపెట్ట వచ్చునులే. నువ్వు నడూ- నీవెంటనే సొమ్ము పంపుతాం.

గంగ—వీడికొంప కూలా! దేవుఁడు వరవిఁస్తే పూజారి యిఁవ్వడన్నట్టు వెయిరూపాయి లొచ్చేవి పాడుచేశాడు. పళ్ల చెట్టు దగ్గిర ముళ్లకంచ లాగ వీడొకడు జతపడ్డాడు! కానీ- ఇదే పారిస్తాం. (పోవును.)

---

## మూడవ రంగము.

(మహారాణి కొలువు తీర్చి యుండును)

రాణి—ఏంవేఁమాచీ! పువ్వులు తేవడాని కింతసేప యిందీ? చామంతి రెండురోజులాయి కనపడలేదు. దాని సంగ తేంవేఁనా తెలిశిందా?

మాచి—పూలుకోయడ వాఁలస్యవఁయిందని దాఁనింటి కెళ్ల లేదమ్మా! ఎల్లిరానా?

(చామంతి ఏడ్చుచూ వచ్చును).

ఇదిగో చావం ఏడుస్తా వొస్తూంది. ఏం వొచ్చిందో?

రాణి—ఏఁవేఁ చావంతీ! ఏడవక మాటచెప్పు.

చామ—అమ్మా! నా గొంప దిబ్బయిందీ, నాబొట్టు చెరిగిందీ! నా మాణిక్కెం జారిపోయింద మ్మగారూ!

రాణి—పోనీ. అదిపోతే ఇంతేడవడ వెందుకూ, మరోటిస్తావుఁలే, అందుకా అగుపడ్డం మానేశావు?

మాచి—అది కాదమ్మా. అయిదోతనం ఊడిందం టున్నాది. గునగునమని గున్నమావిడిచెట్టు లాగుండేవాడు. గంగయ్య కేఁవొచ్చిందో మరి?

రాణి—ఏఁవేఁ? చావంతీ! గంగయ్య బాగున్నాడా?

చామ—నాగొంతు కోశేశారమ్మా! యింతలోనే ఆయుస్సు మూడిపోతుంద నెరగనూ! నేనేం శేతునమ్మా!

రాణి—జబ్బుచేసినట్టే మాకు తెలియలేదూ?

చామ—ఏదమ్మా-రాత్రి తిండితిని పండుకున్నారూ; కొంతసేపటికి కడుపునెప్పి అన్నారూ; వాకిచ్చాను; తల తిరుగుతోం దన్నారు- అమ్మగారూ! అవే ఆఖరు మాటలు. వాటితో సరిపోయిం దాయివ్వూ!

రాణి-- పోనీ- మీకు మారుమనువు లున్నాయిగదా? ఇంకోణ్ణి చేసుకోందువు గాని- ఊరుకో!

చామ—అమ్మయ్యా- అట్లాంటివో డిహ నాకు దొరుకుతాడా? నాకేం వొద్దమ్మా! పెళ్లీ వొద్దు! పెడాకులూ వొద్దూ! ఈగండం గడిస్తే మీపాదాల దగ్గిర కుక్కలాగ పడుంటాను. చాలునీ కాపరం. ఇప్పటిగండం దాటించండమ్మా!

తాణి—ఇప్పు డేం వొచ్చిందీ?

చామ—అమ్మా- పెళ్ళినాడు మీరెట్టి న్నగలన్నీ పూడతీసుకున్నారు. వారిమీద మమకారంచాత వొద్దన్లేక పోయాను. అదిచాలక అప్పులు చేశేశారు- వాళ్లంతా వొచ్చి శవా న్నటకాయించారు. అది నాటికళ్ళే దోవ కనిపించదూ, నే నేం చేతునమ్మా- ఇక్కడికొచ్చి సొమ్ము తెస్తానంటే నన్నొగ్గారు. ఒట్టి శేతుల్తో ఎళితే నన్ను కూడా సంపేశి అయ్యంతో కలిపి కాల్చేస్తానన్నారు.

సూచి—పెళ్లయినా కూడా బుద్ధి రాలేదేం?

రాజు—నువ్వు ఎవర్తెనో చూశి చామంతనుకొన్నావు కాబోలు! గంగయ్య నాదగ్గిరికొచ్చి నెత్తీ నోరూ కొట్టుకుంటే వాడిబాధ చూాళ్ళేక సొమ్మిచ్చి పంపాను.

రాణి—సరిసరి. మిమ్మల్నెవరో దగా చేశారు. గంగయ్య వేషం వేసుకొని వొచ్చి సొమ్ము చేత చిక్కించుకొన్నారు. గంగయ్య ఆస్తంతా పాడు చేసి అప్పులపాలైతే అప్పులవాళ్లు గంగయ్యకేవా న్నరికట్టారు. కాటికి పోనీలేదని చామంతి నా దగ్గిరికొచ్చి యేడిస్తే అప్పులాళ్ల కిచ్చేందుకు సొమ్మి పంపాను.

రాజు—విచిత్రంగా ఉందే ఇది_గంగయ్య నా ఎదుటికొచ్చి చామంతి ఉత్తరక్రియలకి పదివేలిమ్మంటే యిప్పుడే నేను పంపాను.

రాణి—అలాగా? చామంతి నాఎదుటికొచ్చి గంగయ్య అప్పులు తీర్చడానికీ, అతని ఉత్తరక్రియలకీ పదహారువేలిమ్మని ఏడిస్తే యిచ్చి పంపిచా నిప్పుడే.

రాజు—అయితే చచ్చిం దెవరంటావు? చామంతి చచ్చిందని గంగయ్య నాతో చెప్పెనే!

రాణి—గంగయ్య చచ్చాడని చామంతినాతో చెప్తేనే!

రాజు—నీ మాట అబద్ధం, నా మాటే నిజం.

రాణి—నా మాటబద్ధం కాదని నేనురుజువుచెయ్యనా? మాచీ, చామంతిని నేను రమ్మన్నానని పిల్చుకోరా.

రాజు—వెంకటీ! గంగయ్యని నేనపిమ్మన్నానని పిల్చుకోరా....(అందరు వెళ్ళుదురు.)

॥ నాల్గవ రంగము ॥

(గంగయ్య ఇంటిలో గంగయ్య కూర్చుండును)

గంగ—పదివేలు నావాళ్ళో పడ్డాయి కదా, ఇఖ చామంతి ఎఁవైనా తెచ్చినా సరే-తేకున్నా సరే.

(చామంతి చిన్న ముగముతో వచ్చును)

ఏం మొగం తేలేశావు? కలకల పోయిందేఁ? నేనప్పుడే చెప్పలేదూ? రాణీగా రేమిఁవ్వగలరే? ఊరికే పంతం పట్టావు. నీమాట కిందేనా? చెప్పవేఁ?

చామ—నా కెలాగు డబ్బొస్తుంది? రాణిగారు చేతులో డబ్బు లేదన్నారు మగాళ్ల నడక్కపోతే ఆడాళ్లకి సొమ్మెలావొస్తుంది? అదిగాక రాణీగారికి నామీద ఆపేక్ష లేందే! కన్న కడుపా? పెంచిన పేగా? ఏదో ఇంత కూడెట్టి పెంచారు-అంతమాత్రం చాత అడగ్గానే సొమ్ము కుమ్మరిస్తారా?....మీ కేఁవైఁనా దొరికిందా? నాలాగే చేతులు నలుపుగుంటూ నెత్తి మీద కొంగేసుకో వొచ్చారా?

గంగ—అంతే? గడుసు గంగయ్య నీలా గ్గాజులుతొడుక్కో లేదూ-చూడు నా తమాసా! వొట్టి చేతుల్తో వొస్తానా!

చామ—నేనూ కొద్దో గొప్పో తెత్తునుగాని, అక్కడి

గంగ—నువ్వు పదహార్వేలు తెచ్చావుకదా? పదిలా తే! ఆర్వే ల్నువ్వుంచుకో-ఒకరి మాటాకరం వింటూ, ఇరవై వేలూ ఖర్చు పెట్టుకుందాము-అవైంతర్వాత నీ ఆర్వేలూ ఖర్చయేటప్పుడు నీమాట తప్పకుండా నేను వింటాను.

చాము—నే నప్పుడే చెప్పాను-గడుసు బుర్ర,ఆలోచనకి తక్కువలేదు, పేచీపెడ్తారని నాకు తెలుసు.

గంగ—నామాట విను. ఓ పెద్దమనిషున్నాడనుకో, అతడు తననౌఖర్ని పిల్చి, “ఒరే! ఫలానా వారింటికి వెళ్ళి ఫలానా గుర్తులు చెప్పి అత డేదిస్తే అది పట్టుకురా” అని పంపాడనుకో, ఆయిచ్చిందీ యజమాని దాతుందా? తాబేదారి దాతుందా? నువ్వే చెప్పూ.

చాము—సరే—వెళ్ళమని యజమాని చెప్పినప్పుడు ఆనౌఖరు, “అయ్యా, రూపాయికన్నా అత నక్కువిస్తే మీది-తక్కువిస్తేనాది-ఇది మీకు సమ్మతమైతే వెళ్ళి తెస్తాను, లేకుంటే తేను”—అని కరారు చేసుకొని వెళ్ళా డనుకోండి, అవతలివాడు తక్కువిచ్చా డనుకోండి. అది యజమాని కెలా వొస్తుందీ?

గంగ—అబ్బో! రాణివాసంలో తయ్యారైయావు. నీకు మాటలికి కొదవా?

చాము—మీరెంత గడుసువారైనా సభవుకి కట్టుపడాలి. అయినా మాటచెప్పడ వోలాగా పనిచెయ్యడ వోలాగా

మొగాళ్ళకి మామూలే, ఆడాళ్ళు అందరికీ అరువే.

గంగ—నేను చెప్పింది సభవు కాదా?

చామ—కోపం తెచ్చుకోకండి గాని, నేను మీ నౌకరు తాబేదారూ లాంటిదాన్నా?

గంగ—అలా గన్నావు, నాకు నచ్చింది. మనవిద్దరవూఁ సమానులవేఁ గనక నీమాట నేనూ వినాలి, నామాట నువ్వూ వినాలి. (తలుపు చప్పుడగును.)
అదుగో! ఎవరో తలుపు తట్తున్నారు-వెంకటిగాడేవోఁ? మరి నువ్వు చచ్చినట్టు పడుండాలి.

చామ—మా చేవోఁ? మీరే పడుక్కోవాలి, నేం తలుపుతీస్తాను....(వెళ్ళబోవును.)

గంగ—ఉండుండు. కొంప ములుగుతుంది- వెంకటిగాడేవోఁ!

చామ—ఊరుకోండి- పిలవనీ-ఏదో చేదాం.

("తలుపూ! తలుపూ" అని కేక)

గంగ—వీడి థస్సాగొయ్య! పిలవడేవీఁ?

చామ—మాచి గనకనే పేసు పెట్టలేకు- నేం తలుపుతీస్తాను.

గంగ—కొంపముంచకే! మొగాడి గొంతుకులాగుంది.

చామ—కాదంటేనే! అది మా చే-రాణిగారు పంపారు గావోను. నేను వెళ్తాను.

గంగ—అదుగో, అల్లరి చెయ్యకూ-బట్ట కప్పేస్తాను, పడుకో.

చామ—నామాట వింటా నంటే—

గంగ—నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను.

"గంగయ్యా" అని పిలుపు.

అదుగో విన్నావా ? నన్నే పిలుస్తున్నాడు-పడుక్కో.

(గంగయ్య తలుపుతీయ వెంకటి వచ్చును.)

వెంకటీ! నా కొంప ముంచేశింది రా నా చామంతి ! ఇప్పుడే గోదానా లవీ అయినాయి-ఇక దీన్ని తీసుకువెళ్ళడం ఏర్పాటు చెయ్యడానికి బజారుకి మల్లిగాడ్ని పంపాను. చూడు నాయనా, ఒస్తున్నాడో లేదో_

వెంక—మారాజుగారు నిన్ను బేగి రమ్మన్నారు.

గంగ—ఇదో- దీన్ని నడిపించేశి వస్తానని చెప్పు, నాయనా,....(వెంకటి పోవును)

చామ—ఫీడ వొదిలింది. (లేచును) దగ్గిరి కొస్తా డనుకున్నాను. వాడిధర్మాన రాలేదు, బతికాను.

గంగ—అంతే? దగ్గిరికి రానీయడవే ? నా దెబ్బేమను కొన్నావు ?

(తలుపు చప్పుడు)

అదేవి టది? ఉండుండు - మళ్లీ వచ్చాడా ఏవిటి ?

చామ- మాచేవో?....మీరు పడుండాలి. నేం చెప్పి

నట్టు చేస్తానని యిప్పుడేగా మాట యిచ్చారు? కానీండి త్వరగా. ఊఁ! ఊఁ!

గంగ—అలాగే ఉంటాను కాని దగ్గిరసా రానీకేఁ! ఊపిరి శానాసే బిగబట్టలేను.

చామ—పడుకోండి వేగం. కదల కూడదు. మెదల కూడదు.

(తలుపుతీయ మాచి వచ్చును)

అయ్యో! మాచమ్మా! నాకొంప కూలిందే. ఇప్పుడే అప్పులోళ్లు పోయారూ, ముందుపనికోసం మల్లిగాడ్ని బజారు కంపాను, చూశిపెట్టమ్మా! వొస్తున్నాడో లేదో.

మాచి—(గంగయ్య కదులుట చూచి) ఇంకా పానం పోలేదేంటి? కాలు కదల్తావున్నాది?

చామ—పానంపోయి శానా సేపయింది. కాని రోగం పోనేదు. అదేం వోయువో- కాలూ శెయి; కదల్తానే వున్నాయి. వైద్దుడొచ్చి పానం పోయిందని పెదివ్విరిచి పోయాడు.

మాచి—తగని రోగవఁమ్మో! బేగ తొంచు, లేకుంటే, నీకూడా వొస్తుందేవోఁ?

చావ—అంత వున్నవాఁ! ఇదో మల్లిగాడ్డాగానే అంతా శాస్తాడు. ఆడదాన్ని నాశే తేవఁవుతుంది? అత్తగా రుంటే అంతా సూసుకొన్ను.

మూంచి—మా రాణిగారు పిస్తున్నార్రే- బేగిరా!

చామ—ఇదో- ఈపని కాస్తా అయిపోతే ఇకారిదగ్గర్కే వస్తుంటాను. ఇక్కడున్నాకేం పనీ?

(మూంచి వెళ్లగా గంగయ్య లేచును,)

గంగ—ఎంత బాగా శప్పావూ? అందుకే మొగాడు బొంకితే తడకట్టినట్లాగూ, ఆడది బొంకితే గోడపెట్టినట్లాగూ ఉంటుందంటారు.

చామ—ఏం చెయ్యనూ- మించొచ్చినప్పుడూ?

గంగ—వహ్వా! ఏం బుద్ధే నీది! ఏదీ- ఓముద్దు.

చామ—ఆఁఆఁ. తలువు చప్పుడ్లాగుంది!

గంగ—చా! ఛా! ముద్దివ్వాల్సొస్తుందని మాట మరిపిస్తావా?.... పోనీ లే.

చామ—ఇక భోంచేదాము. మరెవరు రారుగదా!

(వెళ్ళుదురు)

ఐదవరంగము.

(రాజుగారు రాణియు కూర్చుందురు)

రాజు—వెంకటి యింకా రాలేదేం?

రాణి—అదేవో? మూంచీ రాలేదూ!

(వెంకటి వచ్చును)

వెంక—మహాప్రభూ! చామంతికోసం గంగయ్య గోలుమని ఏడుస్తావుంటే యినలేక నాగుండె నీరయిపోయింది!

రాజు—వింటివా ప్రేయసీ! నిజము తెలిసినదా? నీవు విన్నది తప్పు; ఎవర్తెయో చామంతిననీ చెప్పి నీయొద్ద సొమ్ము దగాచేసి పుచ్చుకొన్నది.

(మాచి వచ్చును)

మాచి—అమ్మా! గంగయ్యకోసం చావంతి గోలేవిఁ చెప్పనూ! దాన్ని సూస్తే కడుపు చెరువై పోతుంది. పట్టెడు కుంకంబొట్టూ పాడయింది. ఇల్లూ వాకలీ అప్పులో జైగ రేసుకోపోయూరు. ఇంకేవుంది? ఆకాస్తా అగ్గిలో పడేసి అమ్మగారి కొలువు కొస్తానంది.

రాణి—వింటిరా? వెంకటిగాడు వాళ్ళింటికి వెళ్లాడో లేదో? గంగయ్యతో మాట్లాడా నంటున్నాడు!

రాజు—చిత్రముగా నున్నదే, ఏమిరా! గంగయ్యను చూశానంటివే నువ్వు?

వెంక—ఔను మహాప్రభో! మీతో ఆబద్ధంచెప్తానా? ఆడితోనే మ్మాట్లాడి వొస్తేనే!

రాణి—ఏవేఁ మాచీ! వీడిలాగంటున్నాడు?

మాచి—వీ డక్కడికి రాండే.

వెంక—ఛీ పూరుకో? దవడప ళ్ళూడేని.

మాచి—నీగుడ్లు పిదివించనూ? నువ్వెక్కడొచ్చావు వాళ్ళింటికీ?

వెంక—మహాప్రభూ! నే నెళ్ళేటప్పు డిది రాలేదు. గంగయ్య తలుపు తీశాడు-చావంతి శవం మూల పడివుంది. "గోదానా లయ్యాయి-మల్లిగాడ్ని బజారు కంపాను. ఆస్సు రాగానే చామంతిని కాటికంపి నే నొస్తా నన్నాడు." సత్తెం చేశి చెప్తున్నాను. ప్రభువుగారి పాదాల్తోడూ!

మాచి—అమ్మగారూ! నేను తలుపు తట్టేసరికి శావంతి తలుపుతీశింది, గంగయ్య గోడదగ్గిర పడున్నాడు, కాలు కొంచెం కదిలింది, ఏవే, అని శావంతి నడిగినాను. "గంగయ్య పానం పోయింది గాని, రోగవింకా పోలేదనిచెప్పింది." 'అమ్మ గారు నిన్ను బేగి రమ్మన్నారే' అని చెప్పినాను. "గంగయ్యను కాటికం పొస్తా" నంది. ఇందులో అబద్దంవుంటే నాతల పది శెక్కలాతుంది. పిల్లల్తో నున్నాను. నే నబ్ధ వాండతానా?

వెంక—మాప్రభో! దాసీలెంతకైనా సానులు! రొవ్వం తుంటే కొండంత శేస్తారు, ఈ కతంతా ఇది కల్పించిందే. సచ్చింది శావంతిగాని గంగయ్యకాడు; ఇంకోర్నైనా పంపించి చూడండి.

రాజు—ఇందేదో చిత్రముమున్నది. స్వయముగా పోయి చూడవలయు.

రాణి—ఇద్దరూ బ్రతికివుంటే ఇక చచ్చినవా రెవరు?

రాజు—వెంకటేశ సవారీలు సిద్ధము చెయ్యి.

(పోవుదురు)

ఆరవ రంగము.

(గంగయ్య యింట్లో భార్యాభర్తలు కూర్చుందురు)

గంగ—రాజుగారి మనిషీ వొచ్చాడు, రాణీగారి మనిషీ వొచ్చింది. ఇహ భయంలేనట్టే.

చామ—సరేగాని మనం బైటి కెట్లా పోవడవూ?

(తలుపు చప్పుడు)

అదేవిఁటా చప్పుడూ? ఎవరో వొచ్చిన ట్టుందే!

("గంగయ్యా తలుపు" అని కేక)

("చావంతీ తలుపు" అని కేక.)

అమ్మయ్యో! నే న్నూతులో పడ్తాను, రాణిగారి మొగం నూడ్లేను- నాకేం దారీ?

గంగ—సరిసరి- నూతులో పడ్తే స్తావా? అయు న్నంటే ఎవరో బైటికి లాగేస్తారు. చచ్చినా గడుసుచావు చావాలి, నువ్వక్కడ పడుకో, నే నిక్కడ పడుక్కుంటాను అట్నించి నరుక్కొద్దాం. (అట్లు చేయుదురు).

(అందరు లోనికి వత్తురు).

రాజు—అదుగో! చావంతి చచ్చి పడున్నది.

రాణి—ఇదుగో! గంగయ్యా చచ్చి పడున్నాడు.

రాజు—కామ,కాదు. పెళ్లాం కోసం బెంగపెట్టుకొని వీడూ చచ్చాడేమో? వాడిది మెత్తగుండె, చావంతంటే ప్రాణం పెట్టేవాడు.

రాణి—మగాడి కేం మా రాజు! చావంతి పోతే గులాబీ మరొక్కర్తె.

రాజు—చావంతి మాత్రం ఇంకోణ్ణి కట్టుకోకూడదా! అదీ గాక మళ్లీ ఎవర్తెనేనా కట్టుకోనేటట్టయితే ప్రాణ వెందు కొదిలేస్తాడూ?

రాణి—చావంతిది జాలిగుండె గనక గంగయ్య ప్రాణం కాస్తా పోగానే తన ప్రాణం అమాంతంగా వొదిలేశింది.

రాజు—సరే ఇద్దరిచావూ నిజవేఁ కాని, ముందెవరు చచ్చిపోయినారో నిశ్చయం కావడ వేఁలాగా!

మంత్రి—జ్యోతిష్కుడు చెప్పగలడు.

జ్యోతి—అన్నా! వీళ్ళచావు కాదుగాని నాప్రాణ మిన్నాదికి తెచ్చాడీమంత్రి! రాజుగారూ రాణీగారూ పంతం పట్టారు. ఒకరిమాట నిజవంటే ఇంకొకరికోపం. ఈగండం నా పీకమీద కొచ్చింది (లెక్కపెట్టి) మహాప్రభూ! గోచార రీత్యా చూస్తే చంద్రుడు నీచుడై యున్నాడు. సూర్యుడు బాగానే వున్నాడు. గనుక—మొదట ఎవరిప్రాణం పోయిందో వాళ్ళు ముందుచచ్చి ఉంటారు.

మంత్రి—నీ మాటవల్ల వేఁవీఁ తేల్లేదు–ప్రాణంపోవడవన్నా చచ్చిపోవడవన్నా ఒకటే కదా?

రాజు—వెంకటీ-గంగయ్యా చామంతీ యిద్దరూ చచ్చినారు. ఎవరు ముందో నిశ్చయం కావాలి గనక వీళ్ళలో

ముందెవరు చచ్చారో చెప్పగలేవారికి ఆరువేల రూపాయిలు బహుమాన విస్తావని ఊరంతా చాటించూ.

వెంక—చిత్తం.

మంత్రి—ప్రత్యక్షంగా చూశినవాళ్ళు చెప్పాలి. ఫొడి మాటలు చాలవు నిదర్శనం కూడా ఉండాలని చాటించు.

వెంక—చిత్తం.... వెళ్ళును.

గంగ—(తనలో) ఇప్పుడు నేనీ మాట చెప్పేశినట్టాయినా నాకూ పదహారువేలవుతాయి. అప్పటికి నామాటా చామంతి వినాల్సొస్తుంది.

చామ—అన్నా ! ఈసొమ్ము నామొగుడికి రానియ్యడవేవి? నేను చెప్పేశి దాన్ని తీస్కుంటాను.

గంగ }
చామ } (లేచి రాజుతో నొకరూ రాణితో నొకరూ)

ముందు నేనుచావలేదు_సొమ్ము నాకిప్పించండి.

గంగ—(చామంతితో) ఛీ ఊరుకో. ముందు నువ్వే చచ్చావు-రాజుగారే సాక్షి.

చామ—అమ్మా- అతడు చచ్చింతర్వాత మీదగ్గిరికి నేను రాలేదా? (గంగయ్యతో) ముందు నువ్వు-తర్వాత నేనూ_ రాణిగారే సాక్షి.

రాజు—మంచిగమత్తు చేశారే? ఇంత గోలెందుకు చేశావు గంగయ్యా !

# గడుసు గంగయ్య.

గంగ—కోటి విద్దెలూ కూటి కొరకే మహాప్రభూ! తిండి పెట్టారు, గుడ్డిచ్చారు. ఇల్లిచ్చారు-కర్చుక్కానీ అయినా యివ్వలేదు. ఆయిబ్బందిచాత ఇలా చేశావు మారాజా క్షమించండి. ఈ తప్పు కాయండి.

రాణి—నోరుంటే తల కాస్తుం దంటారు? ఈబుద్ధి వరికి పుట్టిందే చావంతీ!

చామ—ఇలాటి పెద్దాలోచన్లు మగాళ్ళకే పుడతాయమ్మా-నే నే వెఱగను.

రాజు—గంగయ్యా. నీయుక్తికి చాలా సంతసించాం ఇకముం దెప్పుడేనా నీకు సొమ్ము కావలిస్తే మమ్మడుగుగాని ఇలాంటి యెత్తు వేయకూ.

గంగ—అలాగే-మహాప్రభూ! కాని మాటోటుంది. మొగుళ్ళా చాలమంది చచ్చారు, వాళ్ళపెళ్ళాలు వాళ్ళ కోసం ఏడ్చారు. నేను చచ్చింతర్వాత నాకోసం చామం తెలా ఏడుస్తుందో ఇప్పుడే వినేశాను, ఇక నేను చచ్చినా లోటు లేదు.

రాజు—(నవ్వి) గడుసు గంగయ్యన్న పేరు నీకు తగిందే! (వెళ్ళుదురు)

స్వస్తి. స్వస్తి. స్వస్తి.



సమాప్తము.